# అథషోడశో%ధ్యాయః

## బ్రహ్మ దేవతల నోదార్చుట

బ్రహ్మోవాచ|

అథ తే నిర్జరాస్సర్వే సుప్రణమ్య ప్రజేశ్వరమ్ | తుష్టువుః పరయా భక్త్యా తారకేణ ప్రపీడితాః || 1

అహం శ్రుత్వామరసుతిం యథార్థాం హృదయంగమామ్ | సుప్రసన్నతరో భూత్వా

ప్రత్యవోచం దివౌకసః || 2

స్వాగతం స్వాధికారా వై నిర్విఘ్నాస్సంతి వస్సురాః | కి మర్థమాగతా యూయమత్ర సర్వే వదంతు మే || 3

ఇతి శ్రుత్వా వచో మే తే నత్వా సర్వే దివౌకసః | మామూచుర్నతకా దీనాస్తారకే ణ ప్రపీడితాః || 4

బ్రహ్మఇట్లు పలికెను-

అపుడా దేవతలందరు తారకునిచే పీడింపబడిన వారై ప్రజాపతిని మహాభక్తితో ప్రణమిల్లి స్తుతించిరి.(1) సత్యము, మనోహరమునగు దేవతల స్తుతిని విని నేను మిక్కిలి ప్రసన్నుడనై దేవతలకు ఇట్లు బదులిడితిని(2). దేవతలారా! స్వాగతము. మీ మీ అధికారములు విఘ్నములు లేకుండా కొనసాగుచున్నవా? మీరందరు ఇచటకుఏల వచ్చితిరి? చెప్పుడు(3). ఆ దేవతలందరు ఈ నామాటను విని ప్రణమిల్లి తారకుని బెడదచే దీనులుగా నున్నవారై నాతో నిట్లనిరి(4).

దేవా ఊచుః |

లోకేశ తారకో దైత్యో వరేణ తవ దర్పితః | నిరస్యాస్మాన్ హఠాత్ స్థానాన్యగ్రహీన్నో బలాత్ స్వయమ్|| 5

భవతః కిము న జ్ఞాతం దుఃఖం యున్న ఉపస్థితమ్| తద్దుఃఖం నాశయ క్షిపం వయం తే శరణం గతాః || 6

అహర్నిశం బాధతేస్మాన్ యత్ర తత్రాస్థితాన్ స వై | పలాయమానాః పశ్యామో యత్ర తత్రాపి తారకమ్ || 7

తారకాన్నశ్చ యద్దుఃఖం సంభూతం సకలేశ్వర | తేన సర్వే వయం తాత పీడితా వికలా అతి|| 8

దేవతలిట్లు పలికిరి-

హే లోకనాథా! నీవు ఇచ్చిన వరముచే గర్వితుడైన తారకాసురుడు మమ్మలను బలాత్కారముగా మాపదవుల నుండి వెళ్లగొట్టి ఆపదవులను తానే ఆక్రమించెను(5), మాకు కలిగిన ఈ విపత్తు గురించి నీకు తెలియనే లేదా? మేము నిన్ను శరణు జొచ్చితిమి. మా దుఃఖమును వెంటనే దూరము చేయుము(6). మేము ఎచ్చట నున్ననూ మమ్మలనీ దుఃఖము రాత్రింబగళ్లు పీడించుచున్నది. మేము ఎచటకు పారిపోయిననూ, తారకుడచటనే మాకు ప్రత్యక్షమగుచున్నాడు(7). హే సర్వేశ్వరా! తండ్రీ తారకుని వలన మాకు సంప్రాప్తమైన దుఃఖముచే మేమందరము మిక్కిలి పీడింపబడి దుఃఖితులమై యున్నాము(8)

అగ్నిర్యమో%థ వరుణో నిర్ ఋతిర్వాయురేవ చ |అన్యే దికృతయశ్చాపి సర్వే యద్వశగామినః || 9

సర్వే మనుష్యధర్మాణస్సర్వైః పరికరై ర్యుతాః | సేవంతే తం మహాదైత్యం న స్వతంత్రాః కదాచన|| 10

ఏవం తేనార్దితా దేవా వశగాస్తస్య సర్వదా| తదిచ్చాకార్య నిరతాస్సర్వే తస్యాను జీవినః || 11

యావత్యో వనితాస్సర్వా యే చాప్యప్సరసాం గణాః| సర్వాంస్తానగ్రహీద్దైత్యస్తరకో%సౌ మహాబలీ||12

అగ్ని, యముడు, వరుణుడు, నిర్ ఋతి, వాయువు, మరియు ఇతర దిక్పాలకులందరు వానికి వశులై(9), మనుష్యులవలె సంచరించుచూ, వివిధ పరికరములను చేతబట్టి, ఆ మహాసురుని సేవించుచున్నారు. వారికి ఒక క్షణమైననూ స్వాతంత్ర్యము లేకున్నది (10). ఇట్లు వానిచే పీడింపబడిన దేవతలందరు అన్ని కాలములయందు వానికి వశులై, వానికోరికకు అనురూపమగు పనులను చేయుచూ, వాని సేవకులై జీవించుచున్నారు.(11) వారి యువతులు అందరు, మరియు అప్సరస స్త్రీలు ఎవరు గలరో, వారిని అందరినీ మహాబలశాలియగు ఆ తారకాసురుడు తన వశము చేసుకొనెను(12)

నయజ్ఞాస్సంప్రవర్తంతే న తపస్యంతి తాపసాః | దాన ధర్మాదికం కించిన్న లోకేషు ప్రవర్తతే|| 13

తస్య సేనాపతిః క్రౌంచో మహాపాప్యస్తి దానవః| స పాతాల తలం గత్వా బాధతే త్వనిశం ప్రజాః || 14

తేన సస్తారకేణ   దం సకలం భువనత్రయమ్ |హృతం హఠాజ్జగద్ధాతః పాపేనాకరుణాత్మనా|| 15

వయం చ తత్ర యాస్యామో యత్ స్థానం త్వం వినిర్దిశేః| స్వస్థాస్తద్వారితాస్తేన లోకనాథా సురారిణా|| 16

యజ్ఞములు ఆగిపోయినవి . తాపసులు తపస్సును చేయుటకు లేదు. లోకములలో దాన ధర్మాదికము లేమియూ జరుగుట లేదు (13) వాని సేనాపతి, మహా పాపి అగు క్రౌంచుసురుడొకడు గలడు. వాడు ప్రతి దినము పాతాళ లోకమునకు వెళ్లి ప్రజలను బాధించుచున్నాడు (14) ఓ జగత్కర్తా! కఠిన హృదయుడు పాపియగు ఆ తారకుడు హఠాత్తుగా ఈ ముల్లోకముల రాజ్యమును మానుండి అపహరించినాడు.(15) హే లోకనాథా! ఆ రాక్షసుడు మా స్థానములకు మేము వెళ్లకుండగా వారించుచున్నాడు. నీవు మాకు ఒక స్థానమును నిర్దేశించుము. మేము అచటకు వెళ్లి స్వస్థులమై ఉండెదము.(16)

త్వం నో గతిశ్చ శాస్తా చ ధాతా త్రాతా త్వమేవ హి| వయం సర్వే తారకాఖ్య వహ్నౌ దగ్ధాస్సువిహ్వలాః || 17

తేన క్రూరా ఉపాయా నస్సర్వే హతబలాః కృతాః| వికారే సంనిపాతే వా వీర్యవంత్యౌషధాని చ || 18

యత్రాస్మాకం జయాశా హి హరిచక్రే సుదర్శనే| ఉత్కుంఠిత మభూత్తస్య కంఠే పుష్పమివార్పితమ్|| 19

మాకు గతి నీవే . మా పాలకుడవు, తండ్రివి, రక్షకుడవు నీవే. మేమందరము తారకుడనే అగ్ని యందు మాడి దుఃఖితులమై యున్నాము.(17) మేము అతని యందు ప్రయోగించిన భయంకరమగు ఆయుధములన్నియూ, సన్నిపాతరోగికి ఈయబడిన గొప్ప శక్తి గల ఔషధముల వలె, నిర్వీర్యములుగా చేయబడినవి(18) విష్ణువు యొక్క సుదర్శన చక్రముపై మాకు జయించగలమనే ఆశ ఉండెడిది. కాని అది అతని కంఠమునందు పుష్పమాలవలె అలంకారమై, నిర్వీర్యమైనది(19).

బ్రహ్మోవాచ|

ఇత్యేతద్వచనం శ్రుత్వానిర్జరాణామహం మునే| ప్రత్యవోచం సురానే సర్వాన్ తత్కాలసదృశం వచః0

మమైవ వచసా దైత్యస్తారకాఖ్యో సమేధితః | న మత్తస్తస్య హననం యుజ్యతే హి దివౌకసః || 21

తతో నైవ వధో యోగ్యో యతో వృద్ధి ముపాగతః|విషవృక్షో%పి సంవర్ధ్య స్వయం ఛేతుమసాం ప్రతమ్|| 22

యుష్మాకం చాఖిలం కార్యం కర్తుం యోగ్యోహి శంకరః| కిం తు స్వయం నశక్తో హి ప్రతికర్తుం ప్రచోదితః || 23

బ్రహ్మ ఇట్లు పలికెను-

ఓ మహర్షీ !దేవతల ఈ వచనములను విని నేను దేవతలనందరినీ ఉద్దేశించి ఆ కాలమునకు తగిన విధముగా నిట్లు బదులిడితిని (20). తారకాసురుడు నా ఆజ్ఞచేతనే పెంచి పెద్ద చేయబడినాడు. ఓ దేవతలారా! నేను అతనిని సంహరించుట సరిగాదు(21). ఒక వ్యక్తి ని ఎవరు పెంచెదరో, వారే అతనిని సంహరించుట యోగ్యము కాదు. విషవృక్షమునైననూ పెంచిన వ్యక్తి తన చేతులతో నరికివేయుట తగదు(22) మీ కార్యమునంతనూ చక్క బెట్టుటకు తగిన వాడు శంకరుడు. కాని మీరు ప్రార్థించిననూ ఆయన స్వయముగా ఆ రాక్షసుని మట్టుబెట్టజాలడు(23)

తారకాఖ్యస్తు పాపేన స్వయమేష్యతి సంక్షయమ్| యథా యూయం సంవిదధ్వ ముపదేశకరస్త్వహమ్||24

నమయా తారకో వధ్యో హరిణాపి హరేణ చ | నాన్యేనాపి సురైర్వాపి మద్వరాత్సత్యముచ్యతే || 25

శివవీర్య సముత్పన్నో యది స్యాత్తనయస్సురాః | స ఏవ తారకాఖ్యస్య హంతా దైతస్య నాపరః || 26

యముపాయమహం వచ్మి తం కురుధ్వం సురోత్తమాః | మహాదేవప్రసాదేన సిద్ధిమేష్యతి ధ్రువమ్|| 27

తారకాసురుడు తాను ఆచరించు పాపముల చేతనే వినాశమును పొందగలడు. మీకు తెలియు విధముగా నేను ఉపదేశమును చేసెగను(24). నేను గాని, విష్ణువు గాని, శివుడు గాని, దేవతలలో ఇతరులెవ్వరైననూ గాని నా వరప్రభవముచే తారకుని వధింపజాలరు. నేను సత్యమును చెప్పుచున్నాను(25). ఓ దేవతలారా !శివుని వీర్యము వలన కుమారుడు జన్మించినచో, అతడు మాత్రమే తారకాసురుని సంహరించగలడు. ఇతరుడు ఎవ్వడూ అతనిని సంహరించజాలడు(26). ఓ దేవతోత్తములారా!నేను చెప్పబోవు ఉపాయమును మీరు ఆచరించుడు. ఆ ఉపాయము మహాదేవుని అనుగ్రముచే నిశ్చయముగా సిద్ధించగలదు.(27)

సతీ దాక్షాయణీ పూర్వం త్యక్త దేహా తు యాభవత్ . సోత్పన్నా మేనకా గర్భాత్సా కథా విదితా హి వః || 28

తస్యా అవశ్యం గిరిశః కరిష్యతి కరగ్రహమ్| తత్కురుధ్వముపాయం చ తథాపి త్రిదివౌకసః || 29

తథా విదధ్వం సుతరాం తస్యాం తు పరియత్నతః| పార్వత్యాం మేనకాజాయాం రేతః ప్రతినిపాతనే||30

తమూర్ధ్వ రేతసం శంభుం సైవ ప్రచ్యుత రేతసమ్ | కర్తుం సమర్థా నాన్యాస్తి తథా కాప్యబలా బలాత్|| 31

పూర్వము దక్షుని కుమార్తెగా జన్మించి దేహమును త్యజించిన సతీదేవియే మేనక గర్భమునందు జన్మించినది. ఈ వృత్తాంతము మీకు తెలిసినదే(28). ఆమెను శివుడు నిశ్చయముగా వివాహమాడు ఉపాయమును మీరు అనుష్ఠించుడు. ఓ దేవతలారా! (29). మేనక కుమార్తె యగు పార్వతి శివుని వీర్యమును తన గర్భమునందు ధరించు ఉపాయమును ప్రయత్న పూర్వకముగా చేయుడు (30) ఊర్ధ్వ రేతస్కుడగు శంభుని సంసారిగా చేయగల శక్తి ఆమెకు తక్క మరియొక స్త్రీకి ఏ విధముగనైననూ లేదు(31) సా సుతా గిరిరాజ్య సాంప్రతం ప్రౌఢ¸ౌవనా| తపస్యంతం హిమగిరౌ నిత్యం సంసేవతే హరమ్||32

వాక్యాద్ధిమవతః కాలీ స్వపితుర్వరతశ్శివా | సఖీభ్యాం సేవతే సార్ధం ధ్యానస్థం పరమేశ్వరమ్ || 33

తామగ్రతో%ర్చమానాం వై త్రైలోక్యే వరవర్ణినీమ్| ధ్యానాసక్తో మహేశో హి మనసాపి న హీయతే|| 34

భార్యాం సమీహేత యథా స కాలీం చంద్రశేఖరం: | తథా విదధ్వం త్రిదశా న చిరాదేవ యత్నతః || 35

ఆ హిమవత్పుత్రిక ఇప్పుడు పూర్ణ¸ౌవనమై ఉన్నది.
హిమవత్పర్వముపై తపస్సును చేయుచున్న శివుని ఆమె ప్రతి
దినము చక్కగా సేవించుచున్నది(32). శివపత్నియగు ఆ కాళి
హిమవంతుని మాటను బట్టి, మరియు తన పట్టుదలవలన,
ధ్యానమునందున్న పరమేశ్వరుని ఇద్దరు సఖురాండ్రతో గూడి
సేవించుచున్నది.(33) ముల్లోకములలో సుందరియగు ఆమె తన
ఎదుట సేవను చేయుచున్ననూ, ధ్యానమగ్నుడగు మహేశ్వరుడు
ఆమెను మనస్సులోనైననూ కోరుకొనలేదు(34) ఓ దేవతలారా! ఆ
చంద్రశేఖరుడు తొందరలోనే ఆ కాళిని భార్యను చేసుకొని కోరికను
పొందునట్లు మీరు దృఢమగు యత్నమును చేయుడు(35)

స్థానం గత్వాథ దైత్యస్య తమహం తారకం తతః | నివారయిష్యే
కుహఠాత్ స్వస్థానం గచ్ఛతామరాః || 36

ఇత్యుక్త్వాహం సురాన్ శీఘ్రం తారకాఖ్యాసురస్య వై | ఉపసంగమ్య
సుప్రీత్యా సమాభాష్యేదమబ్రువమ్|| 37

తేజస్సారమిదం స్వర్గం రాజ్యం త్వం పరిపాసి నః | యదర్థం
సుతపస్తప్తం వాంఛసి త్వం తతో%ధికమ్|| 38

వరశ్చాప్యవరో దత్తోస మయా స్వర్గరాజ్యతా| తస్మాత్స్వర్గం పరిత్యజ్య
క్షితౌ రాజ్యం సమాచర||39

తరువాతనేను ఆ తారకుని స్థానమునకు వెళ్లి అతనిని తన చెడు
పట్టుదలనుండి నివారించగలను. ఓ దేవతలారా! మీ స్థానమునకు
వెళ్లుడు (36). నేను దేవతలతో నిట్లు పలికి. వెంటనే తారకాసురిని
వద్దకు వెళ్లి, మిక్కిలి ప్రీతితో పిలిచి, ఇట్లు చెప్పితిని(37) ఈ
స్వర్గము తేజస్సు యొక్క సారము. నీవు మా రాజ్యమును
పాలించుచున్నావు. నీవు దేనిని కోరి గొప్ప తపస్సును చేసితివో,
అంతకు మించి ఇప్పుడు కోరుచుంటివి.(38) నేను నీకు ఇచ్చిన

వరము ఇంతకంటె తక్కువది. నేను స్వర్గ రాజ్యవరమును నీకీయలేదు. కావున నీవు స్వర్గమును విడిచిపెట్టి, భూమిపై రాజ్యము నేలుము(39).

దేవయాగ్యాని తత్రైవ కార్యాణి నిఖిలాన్యపి |భవిష్యంత్యసురశ్రేష్ఠ నాత్ర కార్యావిచారణా|| 40

ఉత్యుక్త్వా హం చ సంభోధ్యాసురం తం సకలేశ్వరః | స్మృత్వా శివం చ సశివం తత్రాంతర్ధాన మాగతః || 41

తారకో%పి పరిత్యజ్య స్వర్గం క్షితి మధాభ్యగాత్| శోణితాఖ్యపురే స్థిత్వా సర్వరాజ్యం చకార సః || 42

దేవాస్సర్వే%పి తచ్ఛ్రుత్వా మద్వాక్యం సుప్రణమ్య మామ్ | శక్రస్థానం యయుః ప్రీత్యా శ##క్రేణ సుసమాహితాః || 43

తత్ర గత్వా మిలిత్వా చ విచార్య చ పరస్పరమ్ | తే సర్వే మరుతః ప్రీత్యా మ ఘవంతం వచో%బ్రువన్|| 44

ఓ రాక్షసశ్రేష్ఠా! స్వర్గమునకు ఉచితమగు భోగములన్నియూ అచట కూడ ఉండగలవు. నీవీ విషయములో చింతిల్లకుము (40). నేను ఇట్లు పలికి ఆ రాక్షసుని ఒప్పించితిని. సర్వేశ్వరుడనగు నేను ఉమా పరమేశ్వరులను స్మరించి, అచటనే అంతర్ధానమైతిని (41). తారకుడు కూడా స్వర్గమును వీడి భూలోకమునకు వెళ్లి, శోణితనగరమునందున్నవాడై ముల్లోకముల నేలెను (42). నా ఈ మాటను విని దేవతలందరు నాకు ప్రణమిల్లి ఇంద్రునితో గూడి ప్రేమపూర్వకముగా స్వర్గమునకు వెళ్లిరి (43). అచటకు వెళ్లి ఆ దేవతలందరు తమలో తాము చర్చించుకొని ప్రేమ పూర్వకముగా ఇంద్రునితో నిట్లనిరి (44).

దేవా ఊచుః |

శంభోర్యథా శివాయాం వై రుచిర్జాయేత కామతః | మఘవంస్తే ప్రకర్తవ్యం బ్రహ్మోక్తం సర్వమేవ తత్ || 45

దేవతలిట్లు పలికిరి-

ఓ ఇంద్రా! కాముని ప్రభావముచే శంభునకు శివాదేవి యందు అనురాగము కల్గునట్లు నీవు ప్రయత్నించవలెను. ఈ విషయమునంతనూ బ్రహ్మగారు చెప్పియున్నారు గదా! (45)

బ్రహ్మోవాచ|

ఇత్యేవం సర్వవృత్తాంతం వినివేద్య సురేశ్వరమ్ | జగ్మస్తే సర్వతో దేవాస్స్వం స్వం స్థానం ముదాన్వితాః || 46

ఇతి శ్రీ శివమహాపురాణ  ద్వితీయాయాం రుద్రసంహితాయాం తృతీయే పార్వతీ ఖండే దేవసాంత్వన వర్ణనం నామ షోడశో%ధ్యాయః (16).

బ్రహ్మ ఇట్లు పలికెను-

ఆ దేవతలు ఈ తీరున దేవరాజునకు వృత్తాంతమునంతనూ నివేదించి, ఆనందముతో గూడిన వారై తమ తమ స్థానములకు వెళ్లిరి (46).

శ్రీ శివ మహాపురాణములో రుద్ర సంహిత యందు పార్వతీ ఖండములో దేవతల నోదార్చుట అనే పదునారవ అధ్యాయము ముగిసినది (16).